# అథ సప్తదశో%ధ్యాయః

# జంబూద్వీప వర్ణనము

సనత్కుమార ఉవాచ |

పారాశర్య సుసంక్షేపాచ్ఛృణు త్వం వదతో మమ | మండలం చ భువస్సమ్యక్ సప్తద్వీపాదిసంయుతమ్ || 1

జంబూ ప్లక్షశ్శాల్మలిశ్చ కుశః క్రౌంచశ్చ శాకకః | పుష్కరస్సప్తమస్సర్వే సముద్రై స్సప్తభిర్వృతాః || 2

లవణ   క్షురసౌ సర్పిర్దధిదుగ్ధజలాశయాః | జంబూద్వీపస్సమస్తానామేతేషాం మధ్యతః స్థితః || 3

తస్యాపి మేరుః కాలేయ మధ్యే కనకపర్వతః | ప్రవిష్టః షోడశాధస్తాద్యోజనైస్తస్య చోచ్ఛ్రయః || 4

చతురశీతిమానైస్సై#ర్ద్వాత్రింశన్మూర్ధ్ని విస్తృతః | భూమిపృష్ఠస్థశ్చైే%లోయం విస్తరస్తస్య సర్వతః|| 5

మూలే షోడశసాహస్రః కర్ణికాకారసంస్థితః | హిమవాన్ హేమకూటశ్చ నిషధశ్చాస్య దక్షిణ    || 6

నీలశ్శ్వేతశ్చ శృఙ్గీ చ ఉత్తరే వర్షపర్వతాః | దశసాహస్రికా హ్యేతే రత్నవంతో%రుణప్రభాః || 7

సహస్రయోజనోత్సేధాస్తావద్విస్తారిణశ్చ తే | భారతం ప్రథమం వర్షం తతః కింపురుషం స్మృతమ్ || 8

హరివర్షం తతో%న్యద్వై మేరోర్దక్షిణతో మునే | రమ్యకం చోత్తరే పార్శ్వే తస్యాంశే తు హిరణ్మయమ్ || 9

ఉత్తరే కురవశ్చైవ యథా వై భారతం తథా | నవసాహస్రమేకైకమేతేషాం మునిసత్తమ || 10

సనత్కుమారుడు ఇట్లు పలికెను-

ఓ పరాశరపుత్రా! ఏడు ద్వీపములు మొదలగు వాటితో కూడియున్న భూమండలమును గురించి చక్కగా నేను సంగ్రహముగా చెప్పెదను. నీవు వినుము (1). జంబూ-ప్లక్ష-శాల్మలి -కుశ -క్రౌంచ -శాకక-పుష్పకములను ఏడు ద్వీపములను గలవు. ఇవి ఏడు సముద్రములచే చుట్టువారబడి యున్నవి (2). అవి క్రమముగా ఉప్పునీరు, చెరుకు రసము, నెయ్యి, పెరుగు, పాలు, మంచి నీరు అను వాటితో నిండియుండును. ఈ ఏడు ద్వీపములలో జంబూద్వీపము మధ్యలో నున్నది (3). ఓ వ్యాసా! దానికి మధ్యలో బంగరు మేరు పర్వతము గలదు. అది భూమి లోపలికి పదునారు, పైకి ఎనభై నాలుగు యోజనములు వ్యాపించి యున్నది. అగ్రమునందు దాని నిడివి ముప్పది రెండు యోజనములు గలదు. భూమిపై చాల ఎత్తులో ఉన్న ఈ పర్వతము అన్ని వైపులకు విస్తరించి యున్నది (4, 5). అది మూలమునందు పదునార వేల యోజనముల విస్తారమును కలిగియున్నది. అది పద్మముయొక్క బీజకోశమును పోలియున్నది. దానికి దక్షిణములో హిమవాన్, హేమకూటము మరియు నిషధము అను పర్వతములు గలవు (6). ఉత్తరమునందు నీలము, శ్వేతము మరియు శృంగీ అనే వర్ష(భూఖండమును నిర్దేశించే) పర్వతములు గలవు. పదివేల యోజనముల విస్తీర్ణము గల ఈ పర్వతములు రత్నములతో నిండి ఎర్రని కాంతులు కలిగి యుండును (7). ఇవి వేయి యోజనములు ఎత్తు, అంతే నిడివి కలిగి యున్నవి. మొదటి ఖండము భారతము. రెండవది కింపురుషమనబడును (8). ఓ మునీ! తరువాతిది హరివర్షము. అది మేరుపర్వతమునకు దక్షిణములో గలదు. మేరువునకు ఉత్తరభాగమునందు రమ్యకవర్షము గలదు. హిరణ్మయవర్షము దానిలో భాగమే (9). ఓ మహర్షీ! ఉత్తరమునందు కురుదేశము గలదు. భారతవర్షములో సహా ఈ భూభాగములు అన్నియు ఒక్కొక్కటి తొమ్మిదివేల యోజనముల నిడివి కలిగి యున్నవి (10).

ఇలావృతం తు తన్మధ్యే తన్మధ్యే మేరురుచ్ఛ్రితః | మేరోశ్చతుర్దిశం తత్ర నవసాహస్రముచ్ఛ్రితమ్ || 11

ఇతావృతమృషిశ్రేష్ఠ చత్వారశ్చాత్ర పర్వతాః | విష్కంభా రచితా మేరోర్యోజితాః పునరుచ్ఛ్రితాః|| 12

పూర్వే హిమందరో నామ దక్షిణ    గంధమాదనః | విపులః పశ్చిమే భాగే సుపార్శ్వ శ్చోత్తరే స్థితః || 13

కదంబో జంబువృక్షశ్చ పిప్పలో వట ఏవ చ | ఏకాదశశతాయామాః పాదపా గిరికేతవః | 14

జంబూద్వీపస్య నామ్నో వై హేతుం శృణు మహామునే |విరాంజతే మహావృక్షాస్తత్స్వభావం వదామి తే || 15

మహాగజప్రమాణాని జంబ్వాస్తస్యాః ఫలాని చ | పతంతి భూభృతః పృష్ఠే శీర్యమాణాని సర్వతః || 16

రసేన తేషాం విఖ్యాతా తత్ర జంబూనదీతి వై | పరితో వర్తతే తత్ర పీయతే తన్నివాసిభిః || 17

న స్వేదో న చ దౌర్గంధ్యం న జరా చేంద్రియగ్రహః | తస్యాస్తటే స్థితానాం తు జనానాం తన్న జాయతే || 18

తీరమృత్స్నాం చ సంప్రాప్య ముఖవాయువిశోషితామ్ | జాంబూనదాఖ్యం భవతి సువర్ణం సిద్ధభూషణమ్ || 19

భద్రాశ్వం పూర్వతో మేరోః కేతుమాలం చ పశ్చిమే | వర్షే ద్వే తు మునిశ్రేష్ఠ తయోర్మధ్య ఇలావృతమ్ || 20

దాని మధ్యలో ఇలావృతవర్షము గలదు. దాని మధ్యలో ఎత్తైన మేరు పర్వతము గలద. మేరువు అచట నాలుగు దిక్కులయందు తొమ్మిదివేల యోజనముల ఎత్తు ఉండును (11). ఓ మహర్షీ! ఇలావృతము ఇట్టిది. దీనియందు మేరువునకు నాలుగు వైపులయందు నాలగు ఎత్తైన పర్వతములు మేరువునకు బలమునిచ్చే స్తంభముల వలె నిలబడి దానితో జతగూడి యున్నవి (12). తూర్పునందు మందరము, దక్షిణములో గంధమాదనము, పశ్చిమదిక్కునందు విపులము, మరియు ఉత్తరమునందు సుపార్శ్వము అను పర్వతములు గలవు (13). కడిమి చెట్టు,

జంబూవృక్షము, రావి చెట్టు మరియు మర్రిచెట్టు ఆ పర్వతమునకు ధ్వజముల వలె నున్నవి. వాటి ఎత్తు పదకొండు వందల మానములు గలదు (14). ఓ మహర్షీ! జంబూద్వీపము అను పేరు వచ్చుటకు గల కారణమును వినుము. అచట మహావృక్షములు ప్రకాశించుచున్నవి. వాటిస్వభావమును గురించి నీకు చెప్పెదను (15). జంబూవృక్షముయొక్క ఫలములు పెద్ద ఏనుగుయొక్క పరిమాణమును కలిగియుండును. అవి ఆ పర్వతముపై పడి పగిలి అంతటా చెల్లాచెదరు అగుచుండును (16). వాటి రసముచే అచట జంబు అని ప్రసిద్ధిని గాంచిన నదిఏర్పడి అచట పర్వతము చుట్టూ ప్రవహించుచున్నది. అచట నివసించు జనులు ఆ జలమును త్రాగుచుందురు (17). ఆ నదియొక్క తీరమునందు నివసించు జనులకు చెమట పట్టదు. శరీరమునకు దుర్గంధము ఉండదు. ముసలిదనము ఉండదు. వారికి ఇంద్రియముల పటుత్వము తగ్గదు (18). ఆ నదీతీరమనందలి మట్టిని తీసుకని నోటితో గాలి ఊది పొడిగా చేసినచో, అది బంగారమగును. సిద్ధులు ఆ బంగారము యొక్క ఆభరణములను ధరించెదరు. కావుననే, బంగారమునకు జాంబూనదము అను పేర వచ్చినది (19). ఓ మహర్షీ! మేరుపర్వతమునకు తూర్పునందు భద్రాశ్వము, పశ్చిమమమునందు కేతుమాలము అను రెండు భూఖండములు గలవు. ఇలావృతము వాటి మధ్యలో గలదు (20).

వనం చైత్రరథం పూర్వే దక్షిణ    గంధమాదనః | విభ్రాజం పశ్చిమే తద్వదుత్తరే నందనం స్మృతమ్ || 21

అరుణోదం మహాభద్రం శీతోదం మానసం స్మృతమ్ | సరాంస్యేతాని చత్వారి దేవభోగ్యాని సర్వశః || 22

శీతాంజనః కురుంగశ్చ కురరో మాల్యవాంస్తథా | చైకైకప్రముఖా మేరోః పూర్వతః కేసరాచలాః || 23

త్రికూటశ్శిశిరశ్చైవ పతంగో రుచకస్తథా | నిషధః కపిలాద్యాశ్చ దక్షిణ    కేసరాచలాః || 24

సినీవాసః కుసుంభశ్చ కపిలో నారదస్తథా | నాగాదయశ్చ గిరయః పశ్చిమే కేసరాచలాః || 25

శంఖచూడోఽథ ఋషభో హంసో నామ మహీధరః | కాలంజరాద్యాశ్చ తథా ఉత్తరే కేసరాచలాః || 26

మేరోరుపరి మధ్యే హి శాతకౌంభం విధేః పురమ్ | చతుర్దశసహస్రాణి యోజనాని చ సంఖ్యయా || 27

అష్టానాం లోకపాలానాం పరితస్తదనుక్రమాత్ | యథాదిశం యథారూపం పురోఽష్టావుపకల్పితాః || 28

తస్యాం చ బ్రహ్మణః పుర్యాం పాతయిత్వేందుమండలమ్ | విష్ణుపాదవినిష్క్రాంతా గంగా పతితి వై నదీ || 29

సీతా చాలకనందా చ చక్షుర్భద్రా చ వై క్రమాత్ | సా తత్ర పతితా దిక్షు చతుర్ధా ప్రత్యపద్యత || 30

సీతా పూర్వేణ శైలం హి నందా చైవ తు దక్షిణ | సా చక్షుః పశ్చిమే చైవ భద్రా చోత్తరతో వ్రజేత్ || 31

గిరీనతీత్య సకలాంశ్చతుర్దిక్షు మహాంబుధిమ్ | సా య ̧ ° ప్రయతా సూతా గంగా త్రిపథగామినీ || 32

తూర్పు దిక్కునందు చైత్రరథము, దక్షిణమునందు గంధమాదనము, పశ్చిమమునందు విభ్రాజము, ఉత్తరమునుందు నందనము అనే ఉద్యానవనములు గలవు. (21). అరుణోదము, మహాభద్రము, శీతోదము, మానసము అనే ఈ నాలుగు సరస్సులయందు సర్వకాలములలో దేవతలు విహరించెదరు (22). పద్మాకారములోనున్న మేరుపర్వతమునకు కేసరముల స్థానములో తూర్పు దిక్కులో శీతాంజనము, కురుంగము, కురరము మరియు మాల్యవాన్ అనే పర్వతములు గలవు. ఇవి అన్నియు చాల ముఖ్యమైన పర్వతములు (23). త్రికూటము, శిశిరము, పతంగము, రుచకము, నిషధము, కపిలము మొదలైనవి దక్షిణదిక్కునందలి కేసరపర్వతములు (24). పద్మమునకు

కేసరమువలె, మేరువునందు ఆ స్థానములో నుండే పర్వతములు కేసరపర్వతములనబడును. సినీవాసము, కుసుంభము, కపిలము, నారదము, నాగము మొదలైనవి పశ్చిమమునందలి కేసరపర్వతములు (25). శంఖచూడము, ఋషభము, హంసము, కాలంజరము మొదలగునవి ఉత్తరమునందలి కేసరపర్వతములు (26). మేరుపర్వతముయొక్క అగ్రభాగమునందు మధ్యలో బ్రహ్మపురము గలదు. బంగారముతో నిర్మించబడిన ఆ నగరము పదు నాలుగు వేల యోజనముల నిడివి కలిగియున్నది (27). దానిని చుట్టువారి అష్టదిక్పాలకుల నగరములు గలవు. ఆ ఎనిమిది నగరములు క్రమముగా ఆయా దిక్కులలో ఆ దిక్పాలకుల రూపములకు తగినట్లుగా ఉన్నవి (28). విష్ణువుయొక్క పాదములనుండి పుట్టిన గంగానది చంద్రమండలము గుండా ప్రవహించి ఆ బ్రహ్మపురములో పడుచుండును (29). ఆ గంగ అచట నాలుగు దిక్కులలో పడి వరుసగా సీత, అలకనంద, చక్షుస్సు, భద్ర అనే నాలుగు పాయలుగా ప్రవహించును(30). ఆ పర్వతమునకు తూర్పుదిక్కు గుండా సీత, దక్షిణములో నంద, పశ్చిమములో చక్షుస్సు, ఉత్తరదిక్కు గుండా భద్ర ప్రవహించుచున్నవి (31).ముల్లోకములో ప్రవహించే ఆ గంగానది ఈ విధముగా నాలుగు పాయలై నాలుగు దిక్కుల గుండా ప్రవహించి పర్వతములను అన్నింటినీ దాటి మహాసముద్రములో కలియుచున్నది (32).

సునీలనిషధౌ ్ం తౌ మాల్యవద్గంధమాదనౌ | తేషాం మధ్యగతో మేరుః కర్ణికాకారసంస్థితః || 33

భారతః కేతుమాలశ్చ భద్రాశ్వః కురవస్తథా | పత్రాణి లోకపద్మస్య మర్యాదాతోకపర్వతాః || 34

జఠరం దేవకూటశ్చ ఆయామే దక్షిణోత్తరే | గంధమాదనకైలాసౌ పూర్వపశ్చిమతో గతౌ || 35

పూర్వపశ్చిమతో మేరోర్నిషదో నీలపర్వతః | దక్షిణోత్తరమాయాతౌ కర్ణికాంతర్వ్యవస్థితౌ || 36

జఠరాద్యాః స్థితా మేరోర్యేషాం ద్వౌ ద్వౌ వ్యవస్థితౌ | కేసరాః పర్వతా ఏతే శ్వేతాద్యాస్సుమనోరమాః || 37

శైలానాముత్తరే ద్రోణ్యస్సిద్ధచారణసేవితాః | సురమ్యాణి తథా తాసు కాననాని పురాణి చ || 38

సర్వేషాం చైవ దేవానాం యక్షగంధర్వరరక్షసామ్ | క్రీడంతి దేవదైతేయాశ్శైలప్రాయేష్వహర్నిశమ్ || 39

ధర్మిణామాలయా హ్యేతే భౌమాస్స్వర్గాః ప్రకీర్తితాః | న తేషు పాపకర్తారో యాంతి పశ్యంతి కుత్రచిత్ || 40

యాని కింపురుషాదీని వర్షాణ్యష్టౌ మహామునే | న తేషు శోకో నాపత్త్యో నోద్వేగః క్షుద్భయాదికమ్ || 41

స్వస్థాః ప్రజా నిరాతంకాస్సర్వదుఃఖవివర్జితాః | దశ ద్వాదశవర్షాణాం సహస్రాణి స్థిరాయుషః || 42

కృతత్రేతాదికాశ్చైవ భౌమాన్యంభాంసి సర్వతః | న తేషు వర్తతే దేవస్తేషు స్థానేషు కల్పనా || 43

సప్తష్వేతేషు నద్యశ్చ సుజాతాస్స్వర్ణవాలుకాః | శతశస్సంతి క్షుద్రాశ్చ తాసు క్రీడారతా జనాః || 44

ఇతి శ్రీ శివమహాపురాణ ఉమాసంహితాయాం జంబూద్వీపవర్షవర్ణనం నామ సప్తదశో%ధ్యాయః (17).

సునీల-నిషధ-మాల్యవత్-గంధమాదన పర్వతముల మధ్యలో పద్మముయొక్క బీజకోశమును పోలి మేరుపర్వతము గలదు (33). పద్మమును పోలిన ఈ భువనమునకు భారత--కేతుమాల-భద్రాశ్వ-కురువర్షములు (భూభాగములు) రేకల వంటివి. ఈ లోకమునకు హద్దు లోకపర్వతములు (34). ఈ లోకమునకు జఠరస్థానములో దేవకూటము గలదు. ఈ లోకము దక్షిణమునుండి ఉత్తరము వరకు వ్యాపించి యున్నది. గంధమాదనకైలాసపర్వతములు తూర్పునుండి పశ్చిమము వరకు వ్యాపించి యున్నవి (35). మేరువునకు తూర్పునుండి పశ్చిమము వరకు

నిషధనీలపర్వతములు వ్యాపించి యున్నవి. అవి దక్షిణమునుండి ఉత్తరము వరకు విస్తరించి బీజకోశము (పద్మమునకు మధ్యభాగము) అనదగిన స్థానములో కలియుచున్నవి (36). మేరువుయొక్క జఠరస్థానముతో మొదలిడి శ్వేతము మొదలైన జంట పర్వతములు పద్మకేసరముల వలె మిక్కిలి సుందరముగా నున్నవి (37). ఈ పర్వతములకు ఉత్తరమునందు సిద్ధులచే మరియు చారణులచే సేవించబడే జలాశయములు గలవు. ఆ జలాశయములను అనుకొని మిక్కిలి సుందరమగు అడవులు మరియు నగరములు గలవు (38). దేవతలు, యక్షులు, గంధర్వులు మరియు రాక్షసులు అందరికీ ఈ నగరములు చెంది యుండును. ఆ పర్వతప్రాంతములలో దేవతలు మరియు దైత్యులు రాత్రింబగళ్లు క్రీడించుచుందురు (39). ధర్మాత్ములకు నిలయమగు ఈ స్థానములు భూమిపై వెలసిన స్వర్గములని కీర్తించబడినవి. అచటకు పాపాత్ములు వెళ్లలేరు. వారు ఆ సమీపములో కానరాదు (40). ఓ మహర్షీ! కింపురుషము మొదలైన ఎనిమిది భూభాగములలో జనులకు శోకము, ఆపదలు, ఆదుర్దాలు, ఆకలిబాధ మరియు ఇతరభయములు లేవు (41). జనులు ఆరోగ్యవంతులై భయమునుండి మరియు సర్వదుఃఖములనుండి విముక్తులై, పది పన్నెండు వేల సంవత్సరముల ఆయుర్దాయము గలవారై ఉందురు (42). అచట జనులు కృతత్రేతాయుగములందలి జనులవలె ధర్మపరాయణులై ఉందురు. అచట చక్కగా ప్రకాశించే స్వచ్ఛ జలములతో నిండిన జలాశయములు అంతటా గలవు. అచట ఇంద్రుడు వర్షించడు. వర్షించనక్కరలేదు. అచటి సౌందర్యము ఊహాగోచరము మాత్రమే (43). ఈ ఏడు వర్షములయందు బంగరు ఇసుకతిన్నెలు గల అందమైన చిన్న నదులు వందల సంఖ్యలో గలవు. జనులు వాటియందు క్రీడించుటలో అభిరుచిని కలిగియుందురు (44).

శ్రీశివమహాపురాణములోని ఉమాసంహితయందు జంబూద్వీపవర్ణనమనే పదునేడవ అధ్యాయము ముగిసినది (17).